నమః పరమ ఋషిభ్యః.

## దేవతా సంగ్రహము.

ఫలముఁగోరువారలు వేదవిహిత కర్మంబులఁ జేయుచో నుచ్చరించు మంత్రముల సంబోధ్యులై వారలవి యథావిధిగాఁ జేయుచో వారలయుద్దేశ్య ఫలంబులం గలిగించు తలంపుగలవారు దేవతలనం బడుదురు.

అట్టి దేవతలం జెప్పు శబ్దములు అగ్ని - వాయువు - సూర్యుండు - సోముఁడు - ఇంద్రుఁడు - వరుణుండు - యముండు - ప్రజాపతి - విష్ణువు - రుద్రుండు - బ్రహ్మ ఇత్యాదులనేకములు వేదమునందుగాన వచ్చుచున్నవి.

ఈయగ్న్యాది శబ్దంబులకు లోకప్రసిద్ధమగు నర్థమును జెప్పదమన్నచో నందుకు బాధకంబుగలదు - అగ్నివాయు సూర్య సోమశబ్దములకు నిప్పు గాలి సూర్యమండలము చంద్రమండలము అనునర్థములు లోకమున సుప్రసిద్ధములయియున్నవి - అవి యచేతనంబులనియు నందఱు నెఱుంగుదురు - అవి మంత్రోద్దేశ్యంబు లనుటయు ఫలప్రదంబులగుటయు

నైట్లుగూడను- వరుణయమాది శబ్దంబులకు నట్టిలో
క ప్రసిద్ధార్థములుం గానము- అగ్నియనియు వా
యువనియు నిట్లొక్కొక్క చేతనుండు గలండన్న
చో నతండు సశరీరుండో యశరీరుండో కావలయు
ను- సశరీరుండయినచో నెల్లరకుం గానరాండు-
అదృశ్య శరీరుండన్ననో యట్టి శరీరంబునకుం బ్రమ
గానరాదు అశరీరుండన్నను- పరిమితుండో యపరి
మితుండో కావలయును - పరిమితుండయినచో న
నేక ప్రదేశంబుల ననేకులు సేయుయాగంబుల నొక్కం
డెట్లు సంనిహితుండై ఫలప్రదుండగును- ఒక్కండే
యనేక ప్రదేశంబుల కేగుచుండునన్న నొక్కక్ష
ణంబున ననేక ప్రదేశంబులం జేయు యాగంబుల నొ
క్కండెట్లు సంనిహితుండగును- అపరిమితుండయి
నచో నగ్నిశబ్దంబున కపరిమితుండగువాండొక్కం
డర్థమయినట్లు వాయుశబ్దంబునకట్టివాండొక్కం
డగు నిట్లు ప్రతి దేవతయు నపరిమితయగుచోననం
తాపరిమిత సంఘంబు గావలసి వచ్చును- ఇందఱుం
డుటకుం బ్రయోజనము గానరాదు- ఇంతియ గాక
యొక్కొక్కప్పుడు వారసురలచేతం బరాజితులయినట్లు
వేదవాక్యంబులుం గానవచ్చుచున్నవి- అట్టివారలక
దిగూడు నే- అట్లపరిమితస్వరూపులైయును బరిమిత
శక్తులేయగుదురన్నను అట్టివారలు పరిమితజ్ఞానులుం

గావలయును- వారలకుం బరస్పరవివాదముం బుట్ట వలసివచ్చును- ఇంతియకును వివాదములు పుట్టకుం డ నియమించు వాఁడపరిమిత శక్తి యొక్కండుం డ్వాఁడన్నచో నతండె సకలఫలప్రదానశక్తుండయి యున్నచో నిట్టివారలనుద్దేశించి యాగములు సేయు టకంటె నట్టియొక్కని నారాధించుటయె లెస్స యగుంగాదె- అగ్నివాయ్వాదిశబ్దంబులాతనిఁ జెప్ప నన్నచో నిన్నిశబ్దంబులేల- ఇన్నియుం బర్యాయశబ్ద ములయినచో నగ్న్యాదిశబ్దములోఁ జేరినమంత్రం బులో వాయ్వాదిశబ్దము ప్రయోగించినను దోషము లేకుండవలసివచ్చును- సౌర్యయాగంబున నగ్నయే జుష్టం- అను మంత్రమందగ్నిశబ్దస్థానంబున సూర్య పదంబు నూహించవలయునని యిట్లు మీమాంసం జెప్పి న యూహాంబులు నిరర్థకంబులు గావలసివచ్చును- దేవతలని బహువచనముగాఁ జెప్పిన వాక్యములును నిరర్థకములు గావలసివచ్చును- కాఁబట్టి యగ్నివా య్వాదిశబ్దంబులు వేఱువేఱుగ దేవతలం జెప్పునను ట యావశ్యకంబైయున్నది- వారుపరిమితశక్తులని యుఁ జెప్పవలసియున్నది- అయినచో ననేకయాగముల సంనిహితులగుటయెట్లు- పరిమితశక్తులైయును మన కంటెను శక్తివిశేషంబులు గలవారుగాన ననేకయా గముల సంనిహితులగుదురని యందురు.

శబ్దమే యర్థంబునం దెల్పునని యంత దృఢము గాఁ దోచుచున్నది.

ఇందుకు సమాధానమేమన్నను- ఓను- అగ్న్యాది శబ్దము లీశ్వరునిం జెప్పును- అనేక దేవతలం జెప్పును- అది యెట్లన్నను - వేద మంత్రమున నున్న శబ్దమెుక్క కాలంబుననున్న యెుక్క వస్తువును మాత్రమే చెప్పదు అట్లు చెప్పినచో నది యుత్తర కాలంబున నెట్లు ప్రయుక్తమగును- అట్లు ప్రయుక్తంబు గానిచో నది నిత్యమనుమాట యెట్లుగాదును- మఱియేమన్నను- ఏయాకారంబులో శబ్దవ్యవహారమున నెవ్వటికిం జెప్పఁదగినదో యట్టి యాకారము గలదాన్నిఁ స్ఫురించిరొ నిత్యవస్తువులను౦దెన నిత్యవస్తువులనుం దెం జెప్పును- ప్రకృతములో నగ్న్యాది శబ్దములు నట్టి యాకారమున నే యనేకులం జెప్పఁగలయును- అది యిందఱకు ననుగతంబై యితర సాధారణంబు గాని యాకారంబు గావలయును- జ్వలించుట కాల్చుట పక్వము సేయుట తనయందిడిన హవ్యములం గాంచి దేవతలానందించునట్లుండుట మొదలగు స్వభావమగ్ని శబ్దార్థము- అటిస్వభావము ఈశ్వరుండు సర్వాధారంబును సర్వకారణంబును గాన వానియందును లోకప్రసిద్ధంబగు నిప్పునందును దాని నభిమానించియుండు నాత్మయందును గలదు గాన న

గ్నిశబ్దంబున కింకను నర్థాంతరంబులనుటకు బాధకము
లేదు.

అగ్నిర్వా అశామయశేత్యాదిశ్రుతులు భూ
తార్థవాదంబులుగాన నక్కాలంబునకు నవిద్య
త్కాలమున నగ్నియగువాఁడు అగ్నియగుటంగో
ం యప్పటికగ్నియయుయున్న వానినుద్దేశించిచెప్పఁగో
డాశంచిదెననియిట్టి యర్థము జెప్పను-

ఇట్లు వాయుశబ్దంబును వీచుట కదలించుట-
యూర్ధ్వగలిగించుటయను స్వభావమునుబట్టి మున్నె
వలెనే లోకప్రసిద్ధంబగు గాలిం దదభిమాని యగు
నాత్మనన్నిక్రియలకును మూలాధారంబైన యాశ్వరు
గుని జెప్పును.

కావున నైవేద్యకర్మంబులం జేసిన నమ్ముం
దలంచి వీరలివి సేయుచున్నారని రెండింగి దేవతలు
ప్రసన్నులగుచు వీరలయభీష్టంబులు సిద్ధించుంగాత
మని సంకల్పింతురు. వారల సంకల్పంబు చొప్పున
ఫలసిద్ధియగుట యీశ్వరాయత్తముగాన నన్నిటికి
నీశ్వరుండు ఫలప్రదుండను నర్థము. ఉత్తర మీ
మాంసలో ఫలమత ఉపపత్తేః శ్రుతత్వాచ్చ - అ
నునధికరణము నని రూపింపఁబడినది. ఐహికాము
ష్మిక ఫలంబులన్నియు నీశ్వరుని వలననే కలుగును-
అతండు సర్వజ్ఞుండును సర్వశక్తియు నాదటకు న

నిత్యము సుఖంబగునదగు సమట ఫలిగా నున్నది- ఇం
తియగాక- సవా ఏష మహానజ ఆత్మాన్నాదో వసుదా
నః- అని శ్రుతియుం గలదు- అప్పరమేశ్వరుండెల్ల
న్న ధనాదుల నొసంగునని దాని యర్థము- ఏష
హ్యేవానందయాతి- అనియు శ్రుతిగలదు - ఇతఁడె
యానందింపించువాఁడని దాని యర్థము-

ఇట్లీశ్వరుండె సకల ఫలప్రదుండయినచో న
రులు దేవతలు సేయునది యేమున్నది- అతండెట్ల
ప్పట్టంబులం బిలువంబడి ప్రసన్నుండై తత్ఫలప్ర
దుండగుననుటెట్లు చాలదే యన్నను- వినుఁడు ఈ
శ్వరుండు నిర్వికారుండు నిత్యానందుండు- అతని
కొఱకుండు సేయు కర్మంబున సంతోషంబొండెం
గోపంబొండెం గలుగుటకేమి నిమిత్తము- కావున నీ
ప్రపంచంబు సృజించునప్పుడె జీవులకుం గరణకళే
బరాది సాధనసామగ్రిం గల్పించి సంకల్పించుటకుఁద
గారంబొసంగి యెవ్వఁడెట్టి కర్మంబుం జేయువాఁ
డు దానికిఁదగిన ఫలంబుం జెందునని వ్యవస్థం గల్పిం
చి వారలుద్దేశించిన కృత్యంబులు సిద్ధించుటకుం జెడు
టకును పూర్వ జన్మ కర్మానుసారంబున ఫలంబులి
చ్చుటకు వారి స్వాంతంబునం జేసిన సమలకుం దదనుకూల ఫ
లంబు లిచ్చుటకును విచిత్రశక్తియుక్తంబులగు చేతన
ములును దదభిమానులగు దేవతలను నియమించినాఁడు

పాటీర్యై యుండెడి యానందింభుజించుచుండెనిఁడియే.

అట్లైన చెప్పవలయును- తాను పుణ్య పుం ల్యాఁడగుట చేత నేయఁదలఁచునన్ని యుంగలుగున న రాదో యున్నను- అది ప్రత్యక్ష విరుద్ధము- మనమిం క దుష్టకృత్యంబులం జేసినచో దొరతనము వారలు ను వారి పరికరంబులును ద్వారంబుచేసిరొ శా ణార్హుఁడంచు మనల దండించుచున్నాఁడు- సత్కృ త్యంబులంజేసినచో నట్టి వారల ద్వారంబునన నే శా శే యనుగ్రహించుచున్నాఁడు-అట్లు సేయక సంక ల్పమాత్రంబుననే మనకు నిగ్రహానుగ్రహములం జే యుట రొంౘైనం గాదేమి- ఇట్లపో జన్మాంతర లోకాంతరముల యందు నాతండు మనకు ఫలముల నొసంగుట

ఇప్పుడు నిగ్రహానుగ్రహంబులం జేయువాఁడు ప్రత్యక్షముగాఁ గానవచ్చుచున్నాఁడు గానఁ దద్ద్వా రంబున ఫలంబిచ్చుననుట యుక్తమున్నది- దేవతలో యున్న నదృశ్యులు వారలెట్లు ద్వారంబులగుదురన్న ను- వీరలు నదృశ్యులే వీరలాత్మలుగారే- వీరలమమ కారాస్పదంబులగు శరీరంబులు మనకుఁగానవచ్చుం గానఁ దద్ద్వారంబున వీరలు దెలియవచ్చుచున్నా రనవచ్చునందురు - అట్లైనచో వారల మమకారా స్పదంబులగు పృథివ్యాది శరీరంబులును మనకు గా

కవచ్చుచున్నది గానఁ బదభిమాని దేవతలుం దద్వ్యా రంబున దృశ్యులేయని యేల సమాధానము గాదు. వీరలచేష్టలంబట్టి జీవులున్నారని యెఱుంగవచ్చున న్నను భూగోళ చంద్రగోళాదుల చేష్టలం బట్టియు నట్లూహింపరాదే- అవి పరస్పరాకర్షణంబున నగు చున్న దంటిరేని మనశరీరచేష్టలు వేనియాకర్షణంబు లవలనం గలుగుచున్నవి వీనిలోని జీవుల ప్రయత్నం బున నవి గలుగుచున్నవన్నచో నట్లవానిలోని జీవు ల ప్రయత్నంబులనై యవియుం గలుగునని యేల స మాధానము కాదు.

పరిమాణ తారతమ్యంబుల నాకర్షణ భేదం బులు గావచ్చునంటిరేని పక్షిమనుష్యగజాది శరీ రంబుల పరిమాణ తారతమ్యంబుల వాని యాకర్ష ణ భేదంబు లింతుంగానవచ్చిననవి జీవ ప్రయత్నా యత్తంబులు నగుటఁజూచుచున్నాము- గాన వాని యందును జీవప్రయత్నాయత్తంబులనుటయేలెన్న అచేతన క్రియలన్నియుం జేతన ప్రయత్నాయత్తం బులనుటయే లెస్స- అట్లుగానిచో సచేతనంబుల శ క్తి విశేషంబులచే ప్రపంచంబునం గానవచ్చు కా ర్యంబులన్నియు సిద్ధించుచుండ నీశ్వరుండేలా యన వలసి వచ్చును. ఈశ్వరుండున్నాఁడని వేదంబులే ప్రమాణములన్నచోఁ బృథివ్యాద్యభిమాని దేవతలు

క్వారనీయము వేదము చెప్పుచున్నది. (శ్రు) తంమృత్తి
వ్యబ్రవీత్ - అని భూమి పలికినదనియును - ఆపో వా
అగ్రామంయన్త - అని నీర్లు కోరినవనియునిట్లు చెప్పు
టచే భూమి జలాదులకభిమాని దేవతలు గలవనుట
వ్యక్తమగుచున్నది- ఇందుకు హాత్తాహామి మాప్త్రిస్త్రా
దేవతాః- అని పృథివీ జలతేజంబులు దేవతలని వి
షించుట దేవతలభిమానించునవియని తోపింపుచు
న్నది-అగ్నిర్వాగ్భూత్వా ముఖంప్రావిశత్ - అని య
గ్నిదేవుండు వాగింద్రియంబై ముఖముం జొచ్చెనని
యిట్లు చెప్పిన యనుప్రవేశంబు వాగింద్రియాభిమా
నియగుటం దద్ద్వారంబున ముఖముం జొచ్చెనని యి
ట్లు దోపింపుచున్నది ఈ యర్థము. అభిమానివ్యప
దేశస్తు విశేషానుగతిభ్యామ్ అని యుత్తర మీమాంస
౨-అ ౧- పాదములోని సూత్రము దెల్పుచున్నది.

దేవతలకు మనమెఱుంగని యర్థంబులనెఱుం
గటయు మనకంటె నెక్కుడు శక్తి గలుగుటయు న
నువిశేషమున్నను వారలును సంసారమునం గొంత
కాలముండి మహత్తర పుణ్యవశంబున నిట్టి వారలయి
రిగాన వారలకుం బూర్వజన్మాంతర వాసనలేశము న
నువర్తింపుచుండునుగాన మమకారరూపంబయిన
యభిమానముండుటకు బాధకము లేదు.

ఐననుదమ్మును ద్దేశించి యాగ్న్యాదులయందుం

చిన హవ్యములన్నియు నశించుచుండ నందుకు సంత
సిలుటమనకంటె నెక్కుడుజ్ఞానముగలవారలకుం ద
గునేయముశంకవుట్టును. అందుకువినుండు. మన
ము క్షుత్పిపాసాదిపీడితులము గావ మనకు నన్నపానా
దులశరీరంబులలోఁ జొరఁబెట్టుచో శరీరవికారము
లు కొంతశమించుట సుఖించుచున్నాము. దేవతల
కట్టివికారంబులు లేవు గావునట్టి క్షుద్రసుఖంబులఁ గో
రుటకవకాశము లేదు. మరియే మన్నను మనము వారల
యెడం గలుగు భక్తిగౌరవంబులకు సంతసిల్లుదురు.
అట్టిసంతోషము నపేక్షించుట మనలో మిక్కిలి ప్రా
జ్ఞులకు నైతముఁ గలుగుటం జూచుచున్నాము గదా
కాఁబట్టి యట్లు సంతోషించుట సత్పురుషలక్షణమె
కానిదోషావహంబు గాదు. మన భక్తిగౌరవంబులం
దెలుపుసంకేతములే హోమమంత్రజపాదులని యె
ఱుంగునది.

దేవతలును సంసారవాసనగలవారలు గావు
నను ముక్తిం జెంద నపేక్షయుం దగనుకూల బ్రహ్మవి
ద్యాసామర్థ్యముం గలుగవచ్చుం గాన వారలకును బ్ర
హ్మవిద్యాధికారంబు గలదని యుత్తరమీమాంసలో
(౧. అ. ౩. పా) దేవతాధికరణమున. తదుపర్యపి
బాదరాయణస్సంభవాత్ అను సూత్రమునం జెప్పం
బడినది.

ఇన్ద్రియగ్న్యాది దేవతలనుద్దేశించి యేకకాలమున
నే నేమున నేకయాగంబుల జేసినవారు సంనిహితుల
గుదురన్నను వారలుమనవలెంగారు. అనేకప్రదేశం
బులనదుచు కార్యంబుల సంనిహితులగుటకుం దగిన
యనేకపరికరంబులు వారలకుంగలవు గాన బాధక
ములేదు ఇదివిరోధః కర్మణీతిచేన్నానేక ప్రతిపత్తే
ర్దర్శనాత్ అనుసూత్రమునం జెప్పంబడినది. ఇంతియ
గాక యొక్కొక్కయగ్న్యాది నామములుగల దేవతలేయనే
కులుగలరు. ఎట్లన్నను. మహాదేవతలు నల్పదేవతలున
ని దేవతలు రెండు తెగలు. మహాదేవతలనువారు సృష్టి
మొదలుగఁ బ్రళయంబువరకు నుండువారలు. అట్లు
గాక కర్మతారతమ్యంబులం గొంతకాలముండువారి
లల్పదేవతలు. వారలును కర్మదేవులు నాజానజులునని
రెండు తెగలు. భోగమాత్రముం జెందువార లాజానజ
దేవతలు. అట్లుగాక వేదమంత్రంబులం జెప్పిన గ్న్యా
దిశబ్దములం జెప్ప నధికారములం జేరినవారలు కర్మ
దేవులు. వీరలందఱును కల్పమధ్యంబున నానే తమతమ
సత్కర్మంబులు క్షయముగాఁగానే వెండియు మనలో
కంబున జన్మంబులకువత్తురు ఇది. తేతంభుక్త్వా స్వర్గ
లోకంవిశాలం క్షీణేపుణ్యేమర్త్యలోకం విశన్తి. అను
భగవద్గీతావచనమునం జెప్పంబడినది.

కావున నగ్నిదేవతలు మహాగ్నియనియు నగ్ని

లనియును రెండు తెగలు- అతఁడగ్నిసమష్ట్యభిమాని-
తక్కినయగ్నులందఱు నమ్మహాగ్ని పరికరములనఁబడు
దురు- ఇట్లింద్రదేవతలును మహేంద్రుండు నింద్రుం
డునని రెండు తెగలగుట- ఇదియజమానులలో నింద్ర
యాజిమహేంద్రయాజుల విభాగంబున సుస్పష్టం
బైయున్నది- ఇట్లు వాయువరుణాదిదేవతలందెలి
యునది.

ఇట్టి మహాదేవతాపరికరంబులం జేరినయల్ప
దేవతలలోఁ గొందఱు జన్మాంతరీయ కామ్యక్రియోపా
సనలు దీరక దేవత్వంబునసైతము కొన్ని దుష్కృ
త్యంబులం జేసిరని యితిహాసపురాణంబులం గానవ
చ్చుచున్నది- వారలు వారలపై దేవతలచేతదండింపం
బడుచుండుటయుంగలదు.

కర్మజదేవతలుగొందఱాజానజదేవతలకంటెనధి
కానందులు గలరు గొందఱాజానజదేవతలు కర్మదేవ
తలకంటె నధికానందులుం గలరు కావుననే యానంద
తారతమ్యయుం జెప్పుచోఁ దైత్తిరీయంబున నాజా
నజదేవతలకంటెం గర్మదేవతలయానందమధికమనియు
బృహదారణ్యకమునం (ఉ అ- 3 బ్రా) కర్మదేవతలకం
టెనాజానజదేవతల యానందమధికమనియుం జెప్పం
బడినది.

కొందఱు ప్రాచీనవాసనావశంబున మనుష్య

కంశాభిమానులగుచు వీరలు సేయు శ్రాద్ధములకు సంతోషింపుచుందురు వారలు పితృదేవతలనంబడుదురు- వారలతత్త్వము కర్మసంగ్రహమునం దెలుపంబడినది.

కొందఱాటపాటలు సేయుచు నానందించు వారలుగలరువార లుగంధర్వులనంబడుదురు.

ఇట్లు మహాదేవతలు- కర్మజదేవతలు- ఆజానజదేవతలు- పితృదేవతలు- గంధర్వులునని దేవతలైదు తెగలగుచున్నారు.

దేవతలకును పరమదేవతయగువాఁడీశ్వరుండు- కావుననే (శ్రు) తం దైవతానాం పరమంచ దైవతమ్- అను శ్వేతాశ్వతరశ్రుతి.

అట్టియీశ్వరుని నెఱుంగనివారలు కేవలదేవతలనుద్దేశించియే యాగాదులు సేతురు- వారలు అల్పఫలంబులం జెందుదురు- గానియవి శాశ్వతంబులు గావు- ఈశ్వరు నెఱింగిన వారలో యన్నను దేవతలందఱు నీశ్వర పరికరంబులని యెఱింగి యాగాదులం జేతురు- అట్టి వారలను దేవతలత్యాదరింబునం జూచుచు వారల యభీష్టంబుల ఘటింపుచుందురు- దుష్కర్మంబులం జేయు వారల దండింపుచుందురు- ఇందఱుం జేయు పనులీశ్వరుని యధీనంబులు గాన నీశ్వరుండె నిగ్రహానుగ్రహకర్త- నిగ్రహానుగ్ర

మాహేశ్వరులకు ప్రసాదకోశంబులు వేఱగలే నేయు
చుగు- ఏకనివియు నీశ్వరాయత్తంబులు గాన నీశ్వ
ర ప్రసాదకోశంబులని వ్యవహరింతు రింతియగాక-
నిర్వికారానంద స్వరూపునకుం బ్రసాదకోశంబు
లు వేఱుగా నుండుటకుం బ్రసక్తియేమి.

ఇట్లు దేవతలకు లెక్కలేకున్నను- ముప్పది
మూడు కోటులని లెక్క చెప్పుట యధికారను ల
సంఖ్యలం జెప్పుట గాని వ్యక్తి సంఖ్యం జెప్పుట
కాదు.

కావుననే బృహదారణ్య పంచమాధ్యాయంబు
న లో బ్రాహ్మణంబున శాకల్యుండు దేవతలెందఱని
యడుగుచు రాఁగా ముప్పది మూడు వేల యున్నూ
ట యిర్వురు ముప్పది యుగ్గురు- ఆఱుగురు ము
వ్వురు- ఇద్దఱు- అధ్యర్ధము- ఒక్కఁడని యాజ్ఞవ
ల్క్యుఁడు చెప్పినయుత్తరమును మొదటం జెప్పినవార
లు వసువులును- రుద్రులు-నాదిత్యులు నింద్రుండును
ప్రజాపతియునను ముప్పది మువ్వుఱు సరికరంబులే
యనియు నగ్ని పృథివీ వాయ్వంతరిక్ష సూర్యస్వర్గ
చంద్ర నక్షత్రాభిమాని దేవతలు వసువులనియు
నింద్రియము నూఱభిమానులు రుద్రులనియు- మాసా
భిమాను లాదిత్యులనియు- మేఘాకాశాభిమాని యిం
ద్రుండనియు-యజ్ఞ పశ్వభిమాని ప్రజాపతియనియు

దిందఱును పృథివ్యాది స్వర్గాన్తాభిమానుల పరికరం బులనియు - నిందఱుం బృథివ్యన్తరిక్షస్వర్గాభిమానుల పరికరంబులనియు వీరు నన్న ప్రాణాభిమానుల పరిక రంబులనియు - వారును సర్వ సమృద్ధి హేతువగు సవ ర్ధ్యుండనం బరగు వాయువు పరికరంబులనియు - నా వాయువే ప్రాణంబనియు బ్రహ్మంబనియుం జెప్పం బడు నొక్క దేవుండని వివరణంబును గాన వచ్చు చున్నది.

ఇట్లు మనవారలేక దేవుని పరికరంబులే యి తరదేవతలని యెఱింగి సపరికరుండగు దేవుని నారా ధించుచున్నారని యెఱుంగక బహు దేవతలనారా ధించుచున్నారనియు నొక్క దేవుని నెఱుంగరని యుం జెప్పుటయిట్లు చెప్పువారలిట్లే యనేక విష యంబులం దత్త్వం బెఱుంగక చెప్పుదురనుటకు నిదర్శనము.

ఇతి శ్రీ పరవస్తు వేంకట రంగాచార్యులయ్యవార లుంగారిచే రచియింపంబడిన దేవతా సంగ్రహము.

---

VIZAGAPATAM.
Printed by A. C. Srinivasacharier.
Arsha Press. 1874.

